శ్రీమత్తిరుపతిపురమున

శ్రీమిాఅ న్వాలసీ యుండు * శ్రీ హత్తీరాం

జీ మఠపుఁ బురోహితుఁ డగు

రామార్యుని సుతుని చేత * రచియింపఁబడె

శ్రీ

# శ్రీకృష్ణతారావళి.

శా॥ శ్రీరామాధవనాభిపంకజభవుం *
చింతింతు నెల్లప్పుడున్
శ్రీరాజీవదళాక్షు మంగళకరున్ *
శ్రీకంఠుఁ జిత్తంబునన్
శ్రీరామామణి, నారమారమణి, నా *
శ్రీకంఠసాధ్వీమణిన్,
సారంగాక్షుల నాదు వాక్కునను నిం *
టన్సంతతంబుండఁగన్.

చం॥ హిమనగజాత పార్వతికి *
నెంతయుఁ గూర్చెడు సూనుఁడై తడున్
హిమనగజాత తోడుతను *
నెప్పుడు వైరముఁ బూని యుండునా
రమణికి జహ్నుపుత్రికకు *
రంగుగఁ గూర్చెడు నట్టి పుత్రుఁడా
సుమశరరూపు విఘ్నవిభుఁ *
డొక్కపు బత్తిని గొల్తు నిచ్చలున్.

కం॥ వ్రేపల్లె నీవు పుట్టుము
బో పామ్మరి మాయ్యంబంపి * పొడమితివి గదా
యావడంటికి దేవకినేటు
శ్రీపతి ! విశ్వేశ ! శౌరి ! * శ్రీహరి ! కృష్ణా ! 1

కం॥ వ్రేపల్లెను నీవుండుటఁ
బాపాత్ముఁడు కంసుఁ డెఱిగి * పంపిన యసురం
బాపిని జన్నులఁ గుడుచుచుఁ
బాపితె ప్రాణముల కరయ * బాలక ! కృష్ణా ! 2

కం॥ పసగల నీటిని దన దగు
విసమునఁ గలియంగఁ బెట్టు * విషధరమును నీ
విసుమంతయు లెక్కింపక
యసువులకుం బాపలేదె * యౌరా ! కృష్ణా ! 3

కం॥ వలువలఁ జీరము పైనిడి
జలములఁ గ్రీడించు గోప-జలజాక్షులవౌ
వలువలఁ జెట్టునఁ బెట్టనె
జలజాక్షా ! గేలిసేయఁ * జతురతఁ గృష్ణా ! 4

కం॥ కొండను బూజింపంగను
దండింపఁగ గోపకులను-దన మేఘములన్
గండున నింద్రుఁడు పంపఁగఁ
గొండను నెత్తంగ లేదా * కో శ్రీ కృష్ణా ! 5

కం॥ నినుఁ దోడ్కొని పోవఁగవ
చ్చిన యక్రూరునకు నప్పుడు * చిత్రంబుగనా
వనమందు విశ్వ రూపము
దినకర తేజమునఁ జూపి * తే శ్రీ కృష్ణా ! 6

కం॥ అల మథురా నగరంబున
నలగజమును సట్టి ముష్టి * నడఁపఁగ లేదే
యల చాణూరుని నొసటను
బలమునఁ బొడువంగ లేదె * బాలక ! కృష్ణా ! 7

కం॥ నినుఁ జంపఁగఁ బుట్టిన వా
నిని నేఁజంపంగ వలయు * నేఁడని సభలో
నను గూర్చుండిన కంసుని
నని తోయ చంప లేదె * యారా ! కృష్ణా ! 8

కం॥ తలిదండ్రులఁ జెఱసాలకు
వెలి యొనరిచి యుగ్రసేను * విడిపించి చెఱం
బొలుపుగ మథురకు ఱేనిగ
నిలపై స్థాపింప లేదె * యీశ్వర ! కృష్ణా ! 9

కం॥ అందముగ వెలయు కాశిని
సాందీపుని యొద్ద విద్య * సొగసుగఁ గఱచిత
న్నందను యమపురి నుండియు
నందంబుగఁ దెచ్చి యీవె * యప్పుడు కృష్ణా ! 10

కం॥ అదితికిఁ బ్రియము నొనరింపఁగ
మదవతి నీ భార్య సత్య * మానుగ నాయం
బోదవింప బలిమిఁ జంపవె
మద మందిన నరకు నవుడు * మాధవ ! కృష్ణా ! 16

కం॥ తన వనమున నుండిన యా
ఘనతరుపుష్పంబుఁ గోయఁ * గని యింద్రుఁడు చే
సిన మేలు మఱచి యనిచే
సిన వానికి గర్వహాని * సేయవె కృష్ణా ! 17

కం॥ అనిరుద్ధుని గలలోనను
వనితామణి చూచి కూడ * వానిని నీకున్
మనుమని బాణుఁడు గట్టఁగఁ,
బెను బామున, వాని భంగ * పెట్టవె కృష్ణా ! 18

కం॥ గరుడధ్వజుఁడే నే యని
గరుడునికిని మాఱు కపట * గరుడుని పై భా
సురగతిఁ బౌండ్రుఁడు రాఁగా
గరుడధ్వజ ! చంపి యిలను * గావవె కృష్ణా ! 19

కం॥ వైరంబున నిరువదియొక
సారులు మాగధుఁడు నిన్నుఁ * జంపఁగ వెడలన్
శూరుని భీముని గొని చని
వైరము సాధింప లేదె * బాలక ! కృష్ణా ! 20

కం॥ శతదూషణముల కోర్చితి
నితనిం జంపెదను న్వంక * నేనని పలుకన్
మితి మీఱక తిట్టిన, యా
హితదూరుని జంప లేదె * యీవట, కృష్ణా ! 21
కం॥ ధనవంతునకి దరిద్రుని
కిని నెక్కడి స్నేహ మనక * కేశవ! నీవా
ధనహీనుని నీ మిత్రుని
ధనవంతుని జేయలేదె * ధార్మిక ! కృష్ణా ! 22
కం॥ ఆ కృష్ణ నాడు కొలువున
హా ! కృష్ణా ! యంచు వేడ * నంబరతతులన్
శ్రీకాంత ! యొసఁగ లేదా
నాకిమ్మా వరము లిపుడు * నగధర ! కృష్ణా ! 23
కం॥ విజయుం డాహవభూమిని
స్వజనుల నెల్లరను గాంచి * స్వపరాశ్రమముం
ద్యజియింపఁగ నుపదేశము
విజయునకుం జేయలేదె * వేగమె కృష్ణా ! 24
కం॥ ఆ పార్థునిపై బాణము
కోపంబున నేయ నతఁడు * గోపింపఁగనో
పాపఁడ ! భీష్ముని మీఁదికిఁ
గోపంబున నుఱుక లేదా * కో శ్రీ కృష్ణా ! 25

కం॥ బాపఁడ పాండవ మగుమని
శాపంబుగ నేసినట్టి * శరమున నడలం
బాపని గర్భంబున నటు
కాపాడఁగ లేదె మేలి * కరుణను గృష్ణా ! 26

కం॥ మంగళమగు నీకెప్పుడు
మంగళ మొసఁగంగ వేడ * మదిఁ బూనుచునీ
మంగళనామముఁ బల్కెద
మంగళ మెల్లప్పుడుఁ జేయు * మా శ్రీ కృష్ణా ! 27

కం॥ నీ పేరటఁ దారావళి । గోపికతోఁ జెప్పి
నాఁడ * నో శ్రీకృష్ణా ! । కాపాడుము
కాశ్యపుని । స్త్రీపాదము లానఁ
బాయ * నిను నే కృష్ణా ! ॥

శ్రీకృష్ణతారావళి
సంపూర్ణము.
సర్వం శ్రీ కృష్ణార్పణమస్తు.

పాతాళభేది-సుబ్రహ్మణ్యము.



